# క్రీడారంగం

## జమైకాజట్టుపై ఇండియాజట్టు గెలుపు

కింగ్స్టన్, మార్చి 24 : వెస్టిండీస్‌లో పర్యటిస్తున్న భారత క్రికెట్ జట్టు జమైకాజట్టుతో ఆడిన అయిదురోజులఆట ఇవ్వాళ ముగిసింది. ఇండియాజట్టు గెలుపొందింది. జమైకా జట్టు మొదటి ఇన్నింగ్సులో 194 పరుగులు రెండవ ఇన్నింగ్సులో 89 పరుగులు మాత్రం చేసింది. ఇండియాజట్టు మొదటిఇన్నింగ్సులో 140 పరుగులూ, రెండవ ఇన్నింగ్సులో నాలుగువికెట్ల నష్టానికి 147 పరుగులు చేసింది.

### రంజీట్రోఫీ క్రికెట్

కలకత్తా, మార్చి 23 : రంజీట్రోఫీ ఫైనల్సులో బెంగాల్ హోల్కార్ జట్లకు జరుగుతున్న ఆటలో ఇవాళ ఆట ముగిసే వేళకు కలకత్తాజట్టు రెండవఇన్నింగ్సులో 8 వికెట్ల నష్టానికి 287 పరుగులు చేసింది. హోల్కారు జట్టు మొదటిఇన్నింగ్సు 496 పరుగులకు పూర్తిఅయింది. నింబల్కార్ 219 పరుగులు చేశాడు.

మదరాసు, మార్చి 23 : ఫిబ్రవరి 4 వ తేదీ మన్య అడ్మిరల్ రైటురాక సందర్భమున రాష్ట్ర ప్రభుత్వం ఏమీ ఖర్చు అవలేదని ముఖ్యమంత్రి నేడు అసెంబ్లీలో చెప్పారు.

శ్రీ కె. ఓ. గోపాలన్ : అడ్మిరల్ రైటుతో ముఖ్యమంత్రి మధ్యప్రాచ్య రక్షణగురించి ఏమైనా మాట్లాడారా? రాయలసీమకు ఆహారవిరాళము తీసుకొనివచ్చిన రష్యాప్రతినిధుల దగ్గరకు ఎందుకు వెళ్ళలేదు?

జ : అడ్మిరల్ రైటు అమెరికా ఉద్యోగి. మేము కలుసుకున్నది వ్యక్తిగతముగ.







## హైద్రాబాదులో భూదాన యజ్ఞం

### ఇంతవరకు సుమారు 35 వేల ఎకరాల సేకరణ

సికంద్రాబాదు, మార్చి 23 : రెండేళ్ళక్రిందట ఆచార్య వినోభాభావే హైద్రాబాదు సంస్థానంలో భూదానయజ్ఞం ప్రారంభించినప్పటి నుంచి ఇంతవరకు సుమారు 35,000 ఎకరాల భూమిసేకరించబడినట్లు తెలుస్తున్నది. 1954 వ సంవత్సరాంతానికి లక్షయాభై వేల ఎకరాలు సేకరించాలని సంస్థానంలోని భూదానయజ్ఞ కార్యకర్తలను ఆచార్యభావే ఆదేశించారు. 1954 నాటికి దేశం మొత్తం మీద భూదాన యజ్ఞానికి 25 లక్షల ఎకరాలు సేకరించవలసివున్నది. కనుక ఈ సంవత్సరం జూన్ 7 వ తేదీకి లక్ష ఎకరాలు సేకరించుమని సంస్థానంలోని కార్యకర్తలకు ఆచార్యభావే సలహాయిచ్చారు. సంస్థాన ప్రజలకు ఆయన పంపించిన సందేశంలో యిలా వున్నది.

"భూదానయజ్ఞం హైద్రాబాదు సంస్థానంలో మొదట ప్రారంభించబడింది. కనుక మిగతా ప్రాంతాలలోని ప్రజలు ఈ సంస్థానంలో ఈ కార్యక్రమం ...

## ప. గోదావరిలో ధాన్యం ధరల పెరుగుదల

### ఇతరజిల్లాలకు విపరీతంగా ఎగుమతులు

నిడదవోలు, మార్చి 23 : ఈ వారంలో ఆహార పదార్థముల ధరలు బాగా పెరిగిపోయినవి. ధాన్యం మొదటిరకం బస్తా 1 కి రు 28/- లున్న, 2 వ రకం రు 27/- లున్న అమ్ముచున్నారు. బియ్యం మొదటిరకం (2 మణుగుల) బస్తా 1 కి రు 41-8-0 లున్న, 2 వ రకం, రు 39-8-0 లున్న అమ్ముతున్నారు. జొన్నలు 200 మంచముల పుట్టి 1 కి రు 280/- లకు పెరిగినవి. యీ ప్రాంతంనుండి ఎగుమతులయ్యే పర్కుకు పరిమితి లేదు. సైకిళ్లపైకూడా సైకిలుకు ఒక బస్తా చొప్పున కట్టి ఆనకట్టలమీదుగా తూర్పుగోదావరి జిల్లాకెగుమతి చేస్తున్నారు. సామాన్యులు యింత హెచ్చుధరలు పెట్టి కొనలేక చాలా యిబ్బందిపడుతున్నారు. వెంటనే చౌకదుకాణములు తెరచి ధరలు అదుపులో నుంచుట అవసరం.

## 'నక్కలవాగు ప్రాజెక్టు నిర్మించాలి'

## శ్రీకాకుళం ప్రభుత్వ కళాశాల

### 54-55 లో ప్రథమ తరగతి కళాశాల అయ్యే అవసరం

రాజమండ్రి, మార్చి 22: శ్రీకాకుళ పుర ప్రముఖులు శ్రీ తిమ్మరాజా వెంకట శివరావు పంతులు గారు, నిన్న యిక్కడ మకాము చేసియున్న మదరాసు ప్రభుత్వ విద్యాశాఖా మాత్యులు డాక్టర్ యం. వి. కృష్ణారావు గారిని సందర్శించి-శ్రీకాకుళము కాలేజిని ప్రథమ తరగతి కాలేజీగా వచ్చే విద్యాసంవత్సరములోనైన అభివృద్ధి చేయాలని కోరారు.

శ్రీ మంత్రిగారు సమాధానమిస్తూ యీ సంవత్సరములోనే ఇంటర్మీడియటులో సైన్సు గ్రూపులు యేర్పాటు చేసి యున్నామనీ, వచ్చే సంవత్సరములో ప్రథమ తరగతి కళాశాలగా చేయుటకు తగినంత అవకాశము లేదనీ, 1954-55 సం. రం. లో ప్రథమ తరగతి కళాశాలగా చేయుటకు అవకాశముండవచ్చునీ, చెప్పారు. స్వ. వి.

## కరీంనగరం కేంద్రప్రాథమిక పాఠశాల వార్షికోత్సవం

కరీం నగరం మార్చి 20 : జిల్లా కలెక్టరు ...

## రేపల్లె తాలూకా ప్రజాసోషలిస్టు పార్టీ

### అడ్‌హాక్ కమిటీ ఏర్పాటు

రేపల్లె,మార్చి 22 : రేపల్లెతాలూకా ప్రజాసోషలిస్టు పార్టీ కార్యకర్తలు అభిమానులు ఇచ్చట మొన్న సమావేశమై తాలూకా అడ్ హాక్ కమిటీని, పట్టణ అడ్ హాక్ కమిటీని ఏకగ్రీవంగా ఎన్నుకొన్నారు. తాలూకా కమిటీకి ధిట్టు వెంకటేశ్వరరావుగారు కన్వీనరుగాను, అబ్దుల్ రహిమాన్ బేగ్, ఘంటా సుబ్బారావు, కుడిపూడి, గోపాలకృష్ణయ్య, గోవర్ధనగిరి విశ్వేశ్వరరావు, వై. వి. ఎల్. నరశింహారావు గారు సభ్యులుగాను ఏకగ్రీవంగా ఎన్నికైనారు. పట్టణ కమిటీకి వేజెండ్ల వెంకటకృష్ణయ్యగారు కన్వీనరుగాను యింకొ 8 మంది సభ్యులను ఏకగ్రీవముగా ఎన్నుకొన్నారు. పొట్టి శ్రీరాములు గారి మరణానికి విచారము తెలుపుచూ ఒక తీర్మానమున్నూ, మదరాసును ప్రత్యేక రాష్ట్రముగా చేసి మదరాసులోనే ఆంధ్రరాష్ట్ర తాత్కాలిక రాజధాని చేయవలసినదిగామరొక తీర్మానమున్నూ చేశారు. సభకు బలిజేపల్లి వెంకటసుబ్రహ్మణ్యంగారు అధ్యక్షత వహించారు. (స్వ. వి.)

## రేడియో

### గురువారం, మార్చి 26 వ తేదీ

## కృష్ణాజిల్లాబోర్డు

### క్రొత్త ప్రాథమిక పాఠశాలలు ఏర్పాటుచేయుటకు నిర్ణయం

బందరు, మార్చి 22 : నిన్న మధ్యాహ్నము కృష్ణాజిల్లాబోర్డువారు చింతలపూడిలోని బోర్డు కార్యాలయ భవనంలో సమావేశమై గుడివాడ తాలూకా అరిపిరాలనివారు పాలనిబాని పాలెంలోను, బెజవాడతాలూకాలోని గరికపర్రుగూడెం గ్రామంలోను నూజివీడు తాలూకాలోని సద్దుకు గ్రామంలోను నూతనముగా ప్రాథమిక పాఠశాలలు నెలకొల్పుటకును, పెదవలోని బాలికల ప్రాథమిక పాఠశాలను హయ్యర్ గ్రేడు పాఠశాలకు వృద్ధిచేయుటకును తీర్మానించారు.

తెల్లపాలెం రూరల్ ఆయుర్వేద డిస్పెన్సరీకి ఒక మంత్రసానిని మంజూరు చేశారు. బొమ్మిరెడ్డిపాడు గ్రామంలో 3 సెంట్ల భూమిని, అందులోని భవనమును రూరల్ ఆయుర్వేద డిస్పెన్సరీ నెలకొల్పుటకు శ్రీ దామెర వెంకటసుబ్బారావుగారు ఇచ్చిన దానమును బోర్డుకృతజ్ఞతతో స్వీకరించింది.

హాస్టళ్లకు విరాళములు: విజయవాడ అరండల్ పేటలోని హరిజన హాస్టలుకు రూ 300 లు, ...

## బందరు మునిసిపల్ బాలికల హైస్కూలు వార్షికోత్సవము

## టర్కిష్ రాయబార వర్గం

### హైద్రాబాద్‌కు రాక

హైద్రాబాదు, మార్చి 23 : సంస్థానంలో రెండువారాలపాటు పర్యటించే నిమిత్తం 14 మంది సభ్యులుగల టర్కిష్ రాయబార వర్గంవారు ఈ వేళ ఉదయం ఇక్కడికి వచ్చారు. శాసనసభ స్పీకరు శ్రీకాశినాథ్ వైద్య ఇతరఅధికార ప్రముఖులు విమానాశ్రయంవద్ద వారికి స్వాగత మిచ్చారు.

### టర్కిష్ రాయబార వర్గానికి విందు

హైద్రాబాదు, మార్చి 23: ఈ వేళ ఇక్కడికి వచ్చిన టర్కిష్ రాయబారుల గౌరవార్థం స్పీకరు శ్రీ కాశినాథరావు వైద్య విందు చేశారు. హైద్రాబాద్ పబ్లిక్ గార్డెన్సులో యీ విందు జరిగింది. ముఖ్యమంత్రి శ్రీ రామకృష్ణరావు, ఇతర మంత్రులు, శాసనసభ్యులు, కార్పొరేషన్ సభ్యులు మొదలయిన అధికార అనధికారప్రముఖులు ఆ విందులో పాల్గొన్నారు. శాసనసభా స్పీకరు శ్రీ వైద్య, కొరట్ల శ్రీ ఎమ్. హనుమంతరావు గారలు అతిథులకు స్వాగతం చెప్పారు. స్వ.వి.

## మైసూరు ముఖ్యమంత్రి కె. హనుమంతయ్య ఆరోగ్యం

## సాంఘికొఘ్యూన్సిలకి వెల్లోడి సతి కృషి

### ముఖ్యమంత్రి రామకృష్ణ రావుగారి ప్రశంస

## హరికథా కాలక్షేపము

## రాష్ట్రవార్తలు

## సిరిపూర్ పేపర్ మిల్లు కొత్తపాలక వర్గం

## అంధబాలుర ఉన్నతవిద్య

## ధవళేశ్వరానికి గవర్నరు ప్రయాణం

## విజయవాడ పత్రికారచయితల సమావేశం

## కృష్ణ ఆనకట్ట మరమ్మతులు కాంగ్రెసు వాలంటర్ల సహాయం

## టికెట్‌లేని రైల్వే ప్రయాణికులు

## రేబర్తుల్లు ఉపాధ్యాయులకు సకాలంలో జీతాలివ్వాలి

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, Madras.